శ్రీః

పఞ్చవక్త్రశివప్రోక్తమ్

# పాదుకాపఞ్చకమ్

మూలమ్ : స్వామి పూర్ణానంద (1526 సి.ఇ.)

సంస్కృతవ్యాఖ్యా : శ్రీ కాళీచరణః

తెలుగుసేత: చింతగుంట సుబ్బారావు–రావి మోహనరావు

**Fivefold footstool**

1) 12-petalled Adya -Sakti Lotus
2) A-Ka-Tha Triangle abode of Sakti by name A-Ka-Tha
3) Nada, Bindu, ( in the form of Visarga)
4) Manipitha the square
5) the Hamsa (Inversion of Soham Mantra)

Hamsah is the Triangle and KAmakala Nada-Square manipitha jeweled altar-Bindu Isle of gems Set in the Ocean of Nectar The triangle is formed by three Bindus Moon, Sun and Fire (Prakasa, Vimarsa, and Misra-Bindu) Triangle is Purusa-Prakrti Void in the Bindus houses Paramasiva Chandra and Surya Bindus have the void in which abides ParamaSiva.

ప్రకాశకులు

రావి మోహనరావు, కృష్ణకుమారీ దంపతులు

404, జంజనం కాంప్లెక్స్, చీరాల – 523 155.

శ్రీః

పఞ్చవక్త్రశివప్రోక్తమ్

# పాదుకాపఞ్చకమ్

**మూలమ్ : స్వామి పూర్ణానంద (1526 సి.ఇ.)**

**సంస్కృతవ్యాఖ్యా : శ్రీ కాళీచరణః**

**తెలుగుసేత: చింతగుంట సుబ్బారావు–రావి మోహనరావు**

ప్రతులు : 500

ప్రథమ ముద్రణ : 24.12.2018

పుటలు : 32

వెల : రూ.30/–


404, Janjanam Complex,
Opp. I-Town Police Station,
**CHIRALA** - 523 157. **Cell : 94401 15411**

D.T.P.:
P. PARVATHI
Cell : 7416586775.

Printed at :
KARSHAK ART PRINTERS
Hyderabad.

శ్రీః

పఞ్చవక్త్రశివప్రోక్తమ్

# పాదుకాపఞ్చకమ్

అస్య శ్రీ పాదుకాపంచకస్తోత్రమహామంత్రస్య శ్రీదక్షిణామూర్తి ఋషిః; గాయత్రీ ఛందః; హసఖ్ఫ్రేం - బీజం; హసక్షమలవరయూం - శక్తిః; హసఖ్ఫ్రేం - కీలకమ్; శ్రీ గురుదేవతా ప్రీత్యర్థే వినియోగః

| **కరన్యాసః** | **హృదయన్యాసః** |
| --- | --- |
| ఓం హ్రాం అంగుష్ఠాభ్యాం నమః | ఓం హ్రాం హృదయాయ నమః |
| ఓం హ్రీం తర్జనీభ్యాం నమః | ఓం హ్రీం శిరసే స్వాహా |
| ఓం హ్రూం మధ్యమాభ్యాం నమః | ఓం హ్రూం శిఖాయై వషట్ |
| ఓం హ్రైం అనామికాభ్యాం నమః | ఓం హ్రైం కవచాయ హుమ్ |
| ఓం హ్రౌం కనిష్ఠికాభ్యాం నమః | ఓం హ్రౌం నేత్రత్రయాయ వౌషట్ |
| ఓం హ్రః కరతలకరపుష్ఠాభ్యాం నమః | ఓం హ్రః అస్త్రాయ ఫట్ |

మంత్రః - 1

**ఓం ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః హంసః శివః సోఽహం హంసః స్వరూప నిరూపణహేతవే శ్రీగురవే నమః। రక్తామ్బోపేతశ్రీగురుపాదుకాం పూజయామి తర్పయామి నమః।**

మంత్రః - 2 (పుంరూప)

**ఐం హ్రీం శ్రీం హసఖ్ఫ్రేం హసక్షమలవరయూం హసఖ్ఫ్రేం హసౌః।**

మంత్రః - 3 (స్త్రీరూప)

**ఐం హ్రీం శ్రీం సహఖ్ఫ్రేం సహక్షమలవరయూం సహఖ్ఫ్రేం సహౌః।**

మంత్రః - 4 (ఆనందభైరవ)

**'హసక్షమలవరయూమ్'**

**ధ్యానమ్**

శ్లో॥ వన్దే గురుపదద్వన్ద్వమవాఙ్మనసగోచరమ్।
రక్తశుక్లప్రభామిశ్రమతర్క్యం త్రైపురం మహః॥

**షడోపచారః**

లం పృథివ్యాఽఽత్మకం గంధం సమర్పయామి. హం ఆకాశాదికం పుష్పం సమర్పయామి.
యం వాయ్వాత్మకం ధూపం సమర్పయామి. రం వహ్న్యాత్మకం దీపం సమర్పయామి.
వం అమృతాత్మకం నైవేద్యం సమర్పయామి. సం సోమాత్మకం తాంబూలం సమర్పయామి.

# పాదుకాపఞ్చకస్తోత్రమ్

శ్లో॥ బ్రహ్మరన్ధ్రసరసీరుహోదరే
నిత్యలగ్నమవదాతమద్భుతమ్ ।
కుణ్డలీవివరకాణ్డమణ్డితం
ద్వాదశార్ణసరసీరుహం భజే ॥ 1

శ్లో॥ తస్య కన్దలితకర్ణికాపుటే
క్లృప్తరేఖమకథాదిరేఖయా।
కోణలక్షితహళక్షమణ్డలీ-
భావలక్ష్యమబలాలయం భజే ॥ 2

శ్లో॥ తత్పుటే పటుతడిత్కడారిమ
స్పర్ధమానమణిపాటలప్రభమ్।
చిన్తయామి హృది చిన్మయం వపు-
ర్నాదబిన్దుమణిపీఠమణ్డలమ్॥ 3

శ్లో॥ ఊర్ధ్వమస్య హుతభుక్శిఖాత్రయం
తద్విలాసపరిబృంహణాస్పదమ్।
విశ్వఘస్మరమహోచ్చిదోత్కటం
వ్యామృశామి యుగమాదిహంసయోః॥ 4

శ్లో॥ తత్ర నాథచరణారవిన్దయోః
కుఙ్కుమాసవపరీమరన్దయోః।
ద్వన్ద్వమిన్దుమకరన్దశీతలం
మానసం స్మరతి మఙ్గలాస్పదమ్॥ 5

శ్లో॥ నిషక్తమణిపాదుకానియమితాఘకోలాహలం
స్ఫురత్కిసలయారుణం నఖసముల్లసచ్చన్ద్రకమ్।
పరామృతసరోవరోదితసరోజసద్రోచిషం
భజామి శిరసి స్థితం గురుపదారవిన్దద్వయమ్॥ 6

శ్లో॥ పాదుకాపఞ్చకస్తోత్రం పఞ్చవక్త్రాద్వినిర్గతమ్।
షడామ్నాయఫలప్రాప్తం ప్రపఞ్చే చాతిదుర్లభమ్॥ 7

శ్రీః

పఞ్చవక్త్రశివప్రోక్తమ్

# పాదుకాపఞ్చకమ్

సంస్కృత వ్యాఖ్యా : శ్రీ కాలీచరణః
తెలుగుసేత: చింతగుంట సుబ్బారావు-రావి మోహనరావు

*శ్లో॥ బ్రహ్మరన్ధ్రసరసీరుహోదరే నిత్యలగ్నమవదాతమద్భుతమ్ ।*
*కుణ్డలీవివరకాణ్డమణ్డితం ద్వాదశార్ణసరసీరుహం భజే ॥* **1**

**ప్ర:** బ్రహ్మరంధ్ర = బ్రహ్మరంధ్రమను తావున గల, సరసీరుహ = పద్మపు, ఉదరే = మధ్యభాగమున, నిత్యలగ్నమ్ = ఎడతెగని బంధము గల, అవదాతమ్ = తెల్లని కాంతితో, అద్భుతమ్ = ఆశ్చర్యకరమైనదగు, కుండలీవివర = కుండలీ మధ్యగల ఛిద్రమున, కాండ = కాండముతో, మండితమ్ = శోభించునదైన, ద్వాదశ = పంద్రెండు, అర్ణ = వర్ణములుగల, సరసీరుహమ్ = పద్మమును, భజే = ధ్యానింతును.

**తా:** బ్రహ్మరంధ్రమున గల పద్మగర్భమున, అనగా దాని కర్ణికయందు తెల్లనిది, అద్భుతమైనది, ఒక ద్వాదశవర్ణ పద్మమున్నది. ఈ పద్మపు కాండము ఆ పద్మపు కర్ణికయందు నిత్యసంబద్ధమై యున్నది. ఆ ప్రదేశము కుండలినీశక్తి ప్రసరించు చిత్రిణీనాడి యను కాండముతో శోభిల్లునది.

బ్రహ్మరంధ్ర సరసీరుహము సహస్రదళకమలము. ద్వాదశార్ణములు ద్వాదశవర్ణములు లేక అక్షరములు. ఇవి గురుమన్త్రబీజములు. **అ క థ హ ళ క్ష.**

తే.గీ. బ్రహ్మరంధ్రాన పద్మగర్భంబునందు
నిత్యలగ్నంబు నద్భుత నిర్మలంబు
కుండలీవివరంబున కుదురుకొన్న
ద్వాదశార్ణపద్మంబు నౌదల భజింతు.

**అమలా టీకా**

**శ్లో॥పఞ్చవక్త్రకృతపఞ్చపాదుకాస్తోత్రమహం సముదాయనాశకమ్ ।**
**తస్య రోచిరమలాఖ్యటీకయా కోఽపి కాలీచరణః ప్రకాశయేత్ ॥**

అథ త్రిలోకోద్ధారకర్తా సదాశివః స్తోత్రరూపేణ శ్రీగురుధ్యానయోగం కథయిష్యన్ తదర్థం ప్రథమతో గురోరధివాసస్థానం నిరూపయతి బ్రహ్మరన్ధ్రేతి। అస్యార్థః బ్రహ్మరన్ధ్రసరసీరుహస్య బ్రహ్మరన్ధ్రవిశిష్టం యత్ సరసీరుహం సహస్రదలకమలం తస్యోదరే తన్మధ్యే తత్ కర్ణికాయామితి

యావత్। ద్వాదశార్ణసరసీరుహం ద్వాదశవర్ణవిశిష్టం పద్మం, భజే సేవే, ఇత్యర్థః। అత్ర భజే ఇతి క్రియయా అస్మత్కర్తృత్వోపస్థితేః శివవాక్యాత్ శివేన స్వీయభజనీయత్వం దర్శయతా సర్వేషాం శివోక్తమన్త్రోపాసకానాం భజనీయత్వం సూచితమ్। ఏవం సర్వత్ర బోధ్యమ్।

బ్రహ్మరంధ్రస్థానమాహ **కంకాలమాలినీతన్త్రే** సహస్రదలపద్మముపక్రమ్య।

శ్లో॥ తత్కర్ణికాయాం దేవేశి అన్తరాత్మా తతో గురుః।
సూర్యస్య మణ్డలం తత్ర చన్ద్రమణ్డలమేవ చ।
తతో వాయుర్మహానామా బ్రహ్మరన్ధ్రే తతః స్మృతమ్॥ ఇతి॥

కేచిత్ తాదృశపద్మోదరే తత్కర్ణికాస్థత్రికోణోదరే ఇతి వదన్తి। తన్న। అత్రోదరశబ్దస్య మధ్యవాచకత్వాత్ పద్మమధ్యం కర్ణికైవ ప్రతీయతే న తు కర్ణికామధ్య త్రికోణమధ్యమనుపస్థితేః। వ్యక్తమాహ శ్యామాసపర్యాధృతవచనమ్

శ్లో॥ శిరః పద్మే సహస్రారే శుక్లవర్ణే త్వధోముఖే।
తరుణారుణకిఞ్జల్కే సర్వవర్ణవిభూషితే।
కర్ణికాన్తఃపుటే తత్ర ద్వాదశార్ణసరోరుహే॥ ఇత్యాది॥

అత్ర కర్ణికాన్తః పుటే ఇతి సువ్యక్తమ్। ద్వాదశార్ణేతి ద్వాదశవర్ణాః

**స హ ఖ ఫ్రేం హ స క్ష మ ల వ ర యూమ్**

ఇతి గురుమన్త్రాత్మకద్వాదశవర్ణాః తద్విశిష్టపద్మమితి తన్త్రజ్ఞాః। కేచిత్తు ద్వాదశవర్ణో వాగ్భవబీజం తద్యుక్తపద్మమితి వదన్తి। తన్న। తథాత్వే

శ్లో॥ కర్ణికాన్తఃపుటే తత్ర ద్వాదశార్ణసరోరుహే।
తేజోమయే కర్ణికాన్తశ్చన్ద్రమణ్డలమధ్యగే॥

శ్లో॥ అకథాదిత్రిరేఖీయే హలక్షత్రయభూషితే।
హంసపీఠే మన్త్రమయే స్వగురుం శివరూపిణమ్॥

ఇతి వచనే మన్త్రమయే వాగ్భవబీజరూపగురుమన్త్రమయే ఇత్యనేన ద్వాదశార్ణేత్యస్య పౌనరుక్త్యాపత్తేః। ద్వాదశార్ణేతి ద్వాదశ అర్ణాః వర్ణాః యత్ర తదితి వ్యుత్పత్త్యా సరోరుహే ద్వాదశవర్ణయోగః ప్రతీయతే।

యద్యప్యత్ర ద్వాదశవర్ణానాం విశేషాభిధానం తద్యోగస్థానం చ నాభిహితం తథాపి–

శ్లో॥ హంసాభ్యాం పరివృత్తపత్రకమలే దివ్యైర్జగత్కారణైః
విశ్వోత్కీర్ణమనేకదేహనిలయం స్వచ్ఛన్దమాత్మేచ్ఛయా॥ ...

ఇతి గురుగీతాయాం హంసాభ్యాం పరివృత్తపత్రేత్యనేన తాదృశసరోరుహస్య హంసయుక్త–

పత్రం ప్రతీయతే। తయోరేవ షడావృత్త్యా ద్వాదశవర్ణా భవన్తి తద్వ్యక్తం పత్రమ్। అత్ర పత్రావచ్ఛేదే వర్ణయోగకథనాత్ పత్రస్యాపి ద్వాదశసంఖ్యాకత్వం వ్యక్తీభూతమితి సుధీభిర్భావ్యమ్। ద్వాదశార్ణసరోరుహం విశేషయతి నిత్యేతి। నిత్యలగ్నమపినాభావసంబంధేన సహస్రదలపద్మేన మిలితమ్। అవదాతం శుక్లవర్ణమద్భుతం బ్రహ్మతేజోమయత్వాది-నాత్యాశ్చర్యమ్। కుండలీవివరకాండమండితమితి। కుండల్యా వివరం సహస్రదలకమల-కర్ణికాస్థశివసమీపే కుండలీగమనపథరూపం ఛిద్రమ్। తదధికరణభూతకాండం నాలం చిత్రిణీనాడీ తేన భూషితమ్। యథా మృణాలోపరి పద్మస్థితిస్తద్వత్ చిత్రిణీనాడీరూపమృణాల-భూషితమిత్యర్థః।

## అనువాదం

తే.గీ. పంచవక్త్రుండు మున్ను ప్రపంచనాశి
పంచపాదుకాస్తోత్రప్రభలను విరిసె;
తత్ప్రభల్ ప్రకటమ్ముగా దలచి యొకడు
కాళిచరణాఖ్యుడమలటీకంబు గూర్చె.

మూడు లోకాలను ఉద్ధరించువాడైన సదాశివుడు స్తోత్రరూపాన శ్రీగురుధ్యానయోగమును బోధించుచు, ఆ సందర్భమున ప్రప్రథమముగ గురువు అధివసించు స్థానమును 'బ్రహ్మరంధ్రమున' అని నిరూపించుచున్నాడు. దాని అర్థము, బ్రహ్మరంధ్రమున విశేషించి యే సహస్రదళకమలమున్నదో దాని కర్ణికయందు, అని. కనుక ద్వాదశవర్ణములుగల పద్మమును సేవింతునని భావము. ఇక్కడ ప్రయోగింపబడిన 'భజే' అను క్రియద్వారా శివవాక్యమే శివుని స్వీయ సేవ్యత్వాన్ని సూచిస్తూ శివుడుపదేశించిన మంత్రోపాసకుల యొక్కయు సేవ్యత్వమును సూచిస్తూన్నది. ఇదే విధముగ అన్ని తావుల గ్రహించవలెను.

**కంకాళమాలినీతన్త్రం**లో సహస్రదళపద్మమునుద్దేశించి బ్రహ్మరంధ్రస్థానము చెప్పబడినది.

తే.గీ. దాని కర్ణికయందున దనరు నట్టి
అంతరాత్మయై దేవేశి! అలరు గురువు;
సూర్యచంద్రమండలములచ్చోట గలవు
అట మహా యను వాయువార్భటుల వీచు;
బ్రహ్మరంధ్రమ్ముగా నది పలుకబడును.

కొందరేమో 'బ్రహ్మరంధ్రసరసీరుహోదరే' అనగా ఆ పద్మముయొక్క కర్ణికయందున్న త్రికోణమధ్యమున అని అర్థము జేయుచున్నారు. అది సరికాదు. ఇక్కడి ఉదరశబ్దానికి 'మధ్య' అను అర్థమైనందున పద్మమధ్యభాగము కర్ణికగనే చెప్పబడుచున్నది, కర్ణిక మధ్యనున్న త్రికోణమధ్యయనుట పొసగదు కనుక. శ్యామాసపర్యాధృతవచనము స్పష్టముగనే చెప్పినది.

తే.గీ. అరుణకింజల్కశోభితమమలవర్ణ–
మగుచు సర్వవర్ణవిభూషియై యధోము–
ఖాబ్జమగుదాని కర్ణికారంబునందు,
ద్వాదశార్ణపద్మంపు హృద్ధామమందు.

దీనినిబట్టి కర్ణికాన్తఃపుటమందు అనుట సుబోధము. ద్వాదశార్ణములనగా ద్వాదశ వర్ణములు **స హ ఖ ఫ్రేం హ స క్ష మ ల వ ర యూమ్** అను గురుమన్త్రాత్మక మైన పండ్రెండు అక్షరములతో విశిష్టమగు పద్మము సూచితమని తంత్రశాస్త్రము నెఱిగినవారి మతము. కొందరేమో ద్వాదశవర్ణమైన వాగ్భవబీజము గల పద్మమని చెప్పుచున్నారు. ఇది సరికాదు. అట్లేయైనప్పుడు–

తే.గీ. కర్ణికాన్తః పుటమునందు కలిగినట్టి
ద్వాదశార్ణసరోరుహధామమందు
కర్ణికాంతరశశిచంద్రికాంతరమున
అకథలున్ హలక్షలనెడు ఆరు నమరు
మంత్రమయ హంసపీఠినస్మద్గురువును
శివుని రూపైన వానిని (చేరి కొలుతు).

అను ఈ వచనానుసారము వాగ్భవబీజరూపుడైన గురువుమన్త్రమయుడనియే, ద్వాదశార్ణములు, అకథహలక్ష అను నాఱు రెండావృతులుగ పండ్రెండక్షరములగును కనుక. ఈ ద్వాదశాక్షరములు కలిగిన పద్మము చెప్పబడుచున్నది.

ఒకవేళ ఇక్కడ ద్వాదశవర్ణములయొక్క విశేషప్రసంగమున్నూ వాని యోగస్థానమున్నూ చెప్పబడలేదని భావించినను–

తే.గీ. దివ్యసంసారకారణదిష్టమగుచు
స్వేచ్ఛమై యనేక శరీరవేష్టితమగు
విశ్వముంధరియించు వివేకశీలి
హంసపరివృత్తపత్రాబ్జమందు...

అని గురుగీతయందు 'హంసాభ్యాం పరివృత్తపత్ర" మనుట చేత అట్టి పద్మపు హంసయుక్త పత్రము సూచింపబడుచున్నది. వానియొక్క షడావృత్తిచేత వానిని కలిగిన పత్రము ద్వాదశార్ణమగుచున్నది. ఇక్కడ వర్ణముల సంఖ్యయే పత్రసంఖ్య యగుటచే ద్వాదశ పత్రములనియు పండితసంభావ్యము. ద్వాదశార్ణపద్మము నిత్యమని విశేషించబడినది. అవినాభావసంబంధమువలన నిత్యలగ్నముగా సహస్రదళపద్మముతో కలుపబడినది. **అవదాతమనగా** శుక్లవర్ణము. బ్రహ్మతేజోమయమైన కారణమున అద్భుతము, ఆశ్చర్యకరము, కుండలీవివరకాండమండితం, అనగా, కుండలియొక్క మధ్యభాగమున గల ప్రదేశము,

సహస్రదళపద్మమయొక్క కర్ణికలోని శివసమీపమున కుండలిని ప్రయాణించు మార్గమైన ఛిద్రము. దాని అధికరణమైన కాండము లేక నాళము చిత్రిణీనాడి. దానిచే అలంకరింపబడినది. తామరతూడుపై తామరపువ్వు ఎట్లుండునో అట్లు చిత్రిణీనాడీ రూపమైన తామరతూడుపై శోభించునది యని అర్థము.

---

**శ్లో॥ తస్య కన్దలితకర్ణికాపుటే క్లప్తరేఖమకథాదిరేఖయా।**
**కోణలక్షితహళక్షమణ్డలీభావలక్ష్యమబలాలయం భజే ॥ 2**

**ప్ర:** తస్య = దానియొక్క, కందలిత = లేలేత, కర్ణికాపుటే = కర్ణికయొక్క మధ్యభాగమున, అకథ+ఆది రేఖయా = అకథ మొదలగువాని రేఖచే, క్లప్త = యేర్పరుపబడిన, రేఖమ్ = రేఖలుగలది, కోణ = కోణములందు, లక్షిత = యేర్పరించిన, హళక్ష = హ ళ క్ష యను వర్ణములతో, మండలీ = మండలాకారమైన, భావ = భావము, లక్ష్యమ్ = లక్ష్యముగా గలది, అబలా+ఆలయమ్ = శక్తికి నిలయమైన త్రికోణమును, భజే = సేవింతును.

**తా:** ఆ ద్వాదశార్ణపద్మమున **అ,క,థ** ఆది రేఖతో కూడిన రేఖలు గల త్రికోణము కర్ణిక యందున్నది. ఆ త్రికోణపు మూడు కోణములందును **హ,ళ,క్ష** యను మూడు వర్ణములుండును. అనగా, ఈ త్రికోణపు వామరేఖ లేక అగ్నిరేఖ అ నుండి 'క' వరకు గల రేఖగను, దాని మూలబిందువు అ, రేఖాంతబిందువు క యగునట్లుండగా, క నుండి థ రేఖాంతబిందువుగ నొకరేఖయు, థ నుండి మరల మొదటి 'అ' బిందువును కలుపుచూ థాది 'అ' బిందువులగూడి యొక రేఖయు కలిసి **అ క థ** త్రికోణబిందువులుగా, త్రికోణముల లోపలి స్థానములలో **హ ళ క్ష** అనునవి కలిపి మొత్తము సంస్కృతభాషావర్ణములు 51. ఈ త్రికోణము కుండలినీశక్తి నిలయం కనుక **అబలాలయము.** ఈ త్రికోణస్వరూపమును పై అట్ట వెనుక భాగమున చూడగలరు.

## మూలశ్లోకానువాదము

తే.గీ. కందలితకర్ణికాపుటమందు దాని
అకథ బిందుకోణంబులై హలలు క్షయును
సర్వవర్ణాత్మకంబగు శక్తి కెద్ది
నిలయమౌనొ తద్గురు పీఠి నిష్ఠగొల్తు.

## అమలా టీకా

ఉక్త పద్మకర్ణికామకథాది త్రికోణమధ్యే గురుశ్చిన్తనీయః। అతస్తజ్జ్ఞానాయ త్రికోణం నిరూపయిష్యన్నాహ తస్యేతి। అస్యార్థః కందలితకర్ణికాపుటే ఇతి। కందలం పరస్పరా-క్రమణపూర్వకం వాగ్వివాదః। అత్ర లక్షితలక్షణయా పరస్పరాక్రమణమాత్రం గృహ్యతే। పుటమ్

ఆధారభూతస్థానమ్। తతశ్చ తస్య పూర్వోక్తసహస్రదలకమలద్వాదశదలకమలోభయస్య కందలితే పరస్పరాక్రాన్తే కర్ణికాత్మకాధారస్థానే అబలాలయం భజే సేవే ఇత్యన్వయః। కేచిత్తు తస్య ద్వాదశదలస్యేతి వ్యాఖ్యాయన్తి। తన్న। తథాత్వే శ్రీనాథస్య సహస్రదలకమలద్వాదశ దలకమలోభయస్థలే స్థితివిధాయకవక్ష్యమాణవచనానామంగత్యాపత్తేః।

అబలా శక్తిః సా చాత్ర బిందుత్రయాంకురభూతవామాజ్యేష్ఠారౌద్రీనామకత్రిశక్తి- రూపరేఖాత్రయమిలితత్రికోణరూపా కామకలా తద్రూపాలయమిత్యర్థః।

కామకలాయాస్తద్రూపమాహ **యామలే-**

శ్లో॥ అథ కామకలాం వక్ష్యే తత్తద్దేవాత్మరూపకమ్ ।

ఇత్యుపక్రమ్య-

త్రిబిందుః సా త్రిశక్తిః సా త్రిమూర్తిః సా సనాతనీ। ఇత్యాద్యుక్తమ్। సా కామకలా పూర్వదర్శితత్రిశక్తిరూపా ఇత్యర్థః। అబలాలయం విశేషయతి క్లప్తరేఖమకథాదిరేఖయేతి। అకారాదిషోడశస్వరైః వామారేఖా, కకారాదిషోడశవర్ణైర్జ్యేష్ఠారేఖా, థకారాది షోడశభిః రౌద్రీరేఖా ఇతి రేఖాత్రయేణ క్లప్తా చిహ్నితా రేఖా యత్ర తాదృశాబలాలయమిత్యర్థః।

తదుక్తం బృహచ్ఛ్రీక్రమే కామకలాప్రకరణే-

శ్లో॥ బిన్దోరంకురభావేన వర్ణావయవరూపిణీ ॥ ఇతి॥

పునః కిం భూతమ్? కోణలక్షితహలక్షమండలీభావలక్ష్యమితి। కోణేషు ఉక్త త్రికోణస్య అన్తరాలేషు సమ్ముఖదక్షిణవామకోణేషు లక్షితైః ప్రకాశితైః హలక్షవర్ణైః మండలీభావేన తత్తద్వర్ణాంకురరూపేణ లక్ష్యతే జ్ఞాయతే అసౌ తాదృశమిత్యర్థః। అత్ర త్రికోణస్య విశేషజ్ఞానం వినా సమ్యగ్ధ్యానం న భవతీత్యతః ప్రమాణాన్తరేణ త్రికోణం విశేషయతి। అత్ర త్రికోణం వామావర్తేన లేఖనీయమ్।

తదుక్తం **శాక్తానందతరంగిణ్యామ్-**

శ్లో॥ వామావర్తేన విలిఖేదకథాది త్రికోణకమ్ ॥ ఇతి॥

**కాల్యూర్ధ్వామ్నాయే-**

శ్లో॥ త్రిబిన్దుం పరమం తత్త్వం బ్రహ్మవిష్ణుశివాత్మకమ్।
వర్ణమయం త్రికోణం తు జాయతే బిన్దుతత్త్వతః॥ ఇతి॥

తథా-

శ్లో॥ అకారాది విసర్గాన్తా బ్రహ్మరేఖా ప్రజాపతిః।
కకారాది తకారాన్తా విష్ణురేఖా పరాత్పరా।
థకారాది సకారాన్తా శివరేఖా త్రిబిందుతః॥

తన్త్రజీవనే

శ్లో॥ రజః సత్త్వతమోరేఖా యోనిమణ్డలమణ్డితా॥

తథా-

శ్లో॥ ఉపరిష్టాత్ సత్త్వరేఖా రజోరేఖా స్వవామతః।
తమోరేఖా దక్షభాగే రేఖాత్రయముదాహృతమ్॥

ఏతద్వచనపర్యాలోచనయాపి అకథాదీనాం వామావర్తత్వమాయాతమ్।

శ్లో॥ స్వతన్త్రతన్త్రే తు హళక్షమధ్యమణ్డితమ్॥ ఇతి॥
ఏతేన హళక్షవర్ణానాం త్రికోణమధ్యే స్థితిరిత్యుక్తమ్। అలం విస్తరేణ।

**అనువాదము**

చెప్పబడిన అ క థాది త్రికోణమధ్యమున, పద్మకర్ణికయందు గురువు ధ్యానింపదగిన వాడు. ఆ కారణమున వానిని గూర్చిన జ్ఞానముకై త్రికోణమును నిరూపించుచు 'తస్య' అను పదప్రయోగము. దాని అర్థము కందలితకర్ణికాపుటే, అని. 'కందలం। అనగా పరస్పరాక్రమమని మాత్రమే గ్రాహ్యమగును. 'పుటమ్' అనగా ఆధారమైన స్థానము. అందుచే, దాని పూర్వోక్తసహస్రదళపద్మము, ద్వాదశదళపద్మము, అను రెండిటియొక్క 'కందలితము' అనగా పరస్పరాక్రాంతమైన కర్ణికాత్మకాధారస్థానమునందు, **అబలాలయం** 'భజే' సేవింతును, అని అన్వయము. కొందరేమో ఆ ద్వాదశదళపద్మముయొక్క అని వ్యాఖ్యానించుచున్నారు. అది కాదు. అదేయైన శ్రీనాథుని సహస్రదళపద్మము, ద్వాదశదలకమలము, రెండిటియొక్కయు ఉనికిపట్టును చెప్పినట్లగుట యను ప్రమాదమేర్పడును, అందుచే,

**అబలా** యనగా నిచట బిందుత్రయాంకురభూతమైన వామా, జ్యేష్ఠా, రౌద్రీ అని పేరుగల త్రిశక్తిరూపమైన మూడురేఖలు కలసిన త్రికోణరూపయైన **కామకళారూప** ఆలయము, అని భావము.

ఆ శక్తియొక్క కామకళారూపమును **యామలము** ఇట్లనును-

తే.గీ. అంకురాత్మకబిందువౌ నవయవి యనగ
నట్టి వర్ణావయవరూప యనగ వచ్చు;.

ఇంకను ఎట్టిది? కోణలక్షితహలక్షమండలీభావలక్ష్యమని. అనగా, చెప్పబడిన త్రికోణపు లోపలి భాగమున ఎదురుగనున్న కుడి ఎడమ కోణములందు ప్రకాశించు హలక్ష వర్ణములు మండలీభాగమున ఆ యా వర్ణాంకురరూపమున నెఱుగబడును, అని అర్థము. ఇచట త్రికోణమును గూర్చి విశేషజ్ఞానము లేకుండ చక్కగ ధ్యానము సంభవింపదను కారణమున ప్రమాణాన్తరము చేత త్రికోణమును విశేషించుచున్నాడు. ఇచట త్రికోణము ఎడమనుండి ప్రదక్షిణముగ వ్రాయదగినది.

**శాక్తానందతరంగిణి** యందు ఇట్లు చెప్పబడినది–

తే.గీ. ఎడమనుండి ప్రదక్షిణ మెడలి వచ్చి
అకథ బిందు త్రికోణ మమర్చదగును;

**కాల్యూర్ధ్వామ్నాయమున**–

తే.గీ. బ్రహ్మవిష్ణుశివాత్మక పరమతత్త్వ–
బిందు వర్ణమయ మగుచు బిందుతత్త్వ
మందు బుట్టు త్రికోణంబు ననగ వచ్చు;

అట్లే–

తే.గీ. ఆదిగ విసర్గపర్యంత మగును బ్రహ్మ,
కాది తాంతము విష్ణురేఖయన జెల్లు,
థాది సాంతము శివరేఖయనగ నిట్లు
బిందుతస్త్రిరేఖాకోణమిందు వరుస.

**తన్త్రజీవనంలో**–

తే.గీ. సత్త్వరజములు తమమును సాగ రేఖ
లగుచు యోనిమండలముగనాయె నిట్లు.

అట్లే–

తే.గీ. ఊర్ధ్వమున సత్త్వమున్ రజ ముండ నెడమ
దక్షిణాన తమోరేఖ తనరు చుండు.

ఈ వచనములను పర్యాలోచనచేయుటచేతకూడ అకథాదులు వామావర్తములనుట నిశ్చయము.

తే.గీ. మధ్యలో హళక్షలు మూడు బోధ్యమగును.

దీనిచే **హ ళ క్ష** వర్ణములు త్రికోణమధ్యభాగమున ఉండునని చెప్పబడినది. స్వస్తి.



**శ్లో॥ తత్పుటే పటుతటిత్కడారిమస్పర్ధమానమణిపాటలప్రభమ్।**
**చిన్తయామి హృది చిన్మయం వపుర్నాదబిన్దుమణిపీఠమణ్డలమ్॥** ***3***

**ప్ర:** తత్ పుటే = దాని మధ్యభాగమున, పటు = ఫెళఫెళార్భటిగల, తడిత్ = మెఱుపుయొక్క, కడారిమ = తీవ్రతతో, స్పర్ధమాన = పోటీపడుచున్న, మణి = మణియొక్క, పాటలప్రభమ్ = పేలవమైన ఎఱ్ఱని కాంతిగల, నాదబిందుమణిపీఠమండలమ్ = నాదబిందుమణి పీఠమును,

చిన్మయం వపుః = చిన్మయమైన శరీరము గలదానిని, హృది = మనమున, చిన్తయామి = ధ్యానించుచున్నాను.

**తా:** ఆ త్రికోణమధ్యస్థమైన నాదబిందుమణిపీఠమును మనమున ధ్యానించుచున్నాను. ఆ మణిపీఠమున పొదుగబడిన మణుల నును ఎఱ్ఱని కాంతితో పోటీపడుచున్న మెఱుపుకాంతిగల జ్ఞానమయనిర్మితి గలిగినది ఆ మణిపీఠము.

తే.గీ. తత్త్రిభుజిమధ్యలో తడిత్పాటలాభ
మణిరుచుల్ గల్గి చిన్మయమైన నాద-
బిందుమణిపీఠి బ్రార్థింతు డెందమందు.

## అమలా టీకా

ఉక్తత్రికోణమధ్యే మణిపీఠోపరి గురుస్థితిరిత్యతస్తత్ర మణిపీఠం వర్ణయతి తత్పుట ఇతి। అయమర్థః। తత్పుటే ఉక్తత్రికోణమధ్యే నాదబిందుమణిపీఠమండలం హృది మనసి చిన్తయామీత్యన్వయః। నాదబిందుమణిపీఠమండలమితి। నాదబిందుభ్యాం సహ మణిపీఠమండలం అథవా నాదశ్చ బిందుశ్చ మణిపీఠమండలం చ తదిత్యర్థః। కేచిత్తు నాదబిందురూపమణిపీఠమండలమితి వదన్తి। తన్న। తథాత్వే నాదస్య శుక్లవర్ణత్వాత్, బిందోః రక్తవర్ణత్వాత్, పటుతడిత్కడారిమేత్యాది విశేషస్యాసంలగ్నాపత్తేః।

తథాహి-

శ్లో॥ పరశక్తిమయః సాక్షాత్త్రిధాఽసౌ భిద్యతే పునః।
బిన్దునాదో బీజమితి తస్య భేదాః సమీరితాః॥

ఇతి శారదావచనస్య పరశక్తిమయో బిందుః తే బీజనాదబిందవః వహ్నీన్ద్వర్కస్వరూపిణః ఇత్యర్థకత్వే నాదస్య చంద్రస్వరూపత్వాత్ శుక్లత్వే బిందోః సూర్యస్వరూపత్వాత్ రక్తత్వమాయాతమ్।

వ్యక్తమాహ **షట్చక్రవర్ణనే-**

శ్లో॥ తదూర్ధ్వే నాదోఽసౌ బలధవలసుధాధారసన్తానహాసీ॥ ఇతి॥

**బృహచ్ఛ్రీక్రమే-**

శ్లో॥ బాలసూర్యప్రతీకాశమాసీద్బిందుమదక్షరమ్॥ ఇతి॥

ఏవం చ తయోః శుక్లరక్తత్వే మషిపాటలప్రభత్వం సర్వథాఽసంభవమ్। అతః ప్రదర్శితార్థం ఏవం సాధీయాన్। **ఏవం చాధోనాదః ఊర్ధ్వే బిందుః మధ్యే మణిపీఠమండలం చిన్తనీయమితి వ్యవస్థా।**

వ్యక్తమాహ **కంకాలమాలినీతంత్రే గురుధ్యానే–**

శ్లో॥ సహస్రదలపద్మస్థమన్తరాత్మానముత్తమమ్।
తస్యోపరి నాదబిందోర్మధ్యే సింహాసనోజ్జ్వలమ్।
తస్మిన్నిజగురుం నిత్యం రజతాచలసన్నిభమ్॥ ఇత్యాది॥

మణిపీఠమండలం విశేషయతి పటుతడిత్కడారిమస్పర్ధమానమణిపాటలప్రభమితి। స్వకార్యసుసంపాదనయోగ్యత్వం పటుత్వమ్। తతశ్చ స్వప్రకాశరూపస్వకార్యసంపాదనవిరోధి దోషరాహిత్యేన సర్వవ్యాపకాతిప్రకాశమానానాం తడితాం కడారిమ్నా కడారిమ్నా–సదృశకడారిమ్నా పింగలవర్ణేన స్పర్ధమానైర్మణిభిః పాటలప్రభమిత్యర్థః। మణిపీఠస్య మణిమయ సర్వాంగత్వాత్। అస్య నాదబిందుమణిపీఠమండలస్థవపుశ్చిన్మయం జ్ఞానమయమిత్యర్థః। అన్యే తు చిన్మయం వపుః ద్వాదశస్వరస్వరూపం వాగ్భవబీజం గురుమన్త్రం వపుశ్చిన్తనీయమితి వదన్తి। తన్మన్దమ్॥ గురోః శుక్లవర్ణత్వాత్ తద్బీజస్యాపి శుక్లత్వేన మణిపాటలప్రభత్వవిశేషణం న సంగచ్ఛతే।

**అనువాదము**

పై జెప్పబడిన త్రికోణమధ్యభాగమునగల మణిపీఠముపై గురువుండుట కారణముగా ఆ మణిపీఠమును **తత్ పుటే** అని వర్ణించుచున్నాడు. దీని అర్థము: ఆ పుటమున చెప్పబడిన త్రికోణమధ్యమునగల నాదబిందుమండలమును **హృది** అనగా మనసున **చిన్తయామి**, ధ్యానింతును, అని అన్వయము. **నాదబిందుమణిపీఠమండలం** అనగా, నాదబిందువులతో సహ మణిపీఠమండలమును, అని, లేదా, నాదమును, బిందువును, మణిపీఠమండలమును కూడ అని అర్థము. కొందరు నాదబిందురూపమైన మణిపీఠమండలము, అని చెప్పుచున్నారు. అది కాదు: అట్లేయైన నాదముయొక్క శుక్లవర్ణము కారణముగా, బిందువుయొక్క రక్తవర్ణము కారణముగా **పటుతడిత్కడారిమ** ఇత్యాది విశేషణము పొసగక పోవుట యేర్పడును.

అట్లే–

తే.గీ. బిందునాద బీజంబులై భిన్నమగుచు
మూడువిధముల పరశక్తి మూర్తి గట్టె.

అను శారదావచనమునకు బిందువు పరశక్తిమయమనియు, దానికి బీజ, నాద, బిందువులు అగ్ని, చంద్ర, సూర్యరూపులనియు, అర్థమున్నందున, నాదమునకు చంద్ర స్వరూపమున్నందున, బిందువుయొక్క శుక్లత్వమునకు రక్తత్వము సూర్యస్వరూపము వలన కలిగినది.

**షట్చక్రవర్ణనములో** స్పష్టముగనే చెప్పబడినది–

తే.గీ. దానికూర్ధ్వాన బలదేవధవళమగుచు
ధారగట్టుచు సుధల నాదంబు నవ్వు.

**బృహచ్ఛ్రీక్రమంలో–**

తే.గీ. బాలసూర్యప్రతీకాశమై వెలుంగు
బిందురూపాక్షరంబొకండందులోన.

ఈ విధంగా కూడ వారిద్దరియొక్క శుక్లరక్తత్వములో మసకయైన పాటల వర్ణము సర్వవిధముల అసంభవము. ఆ కారణమునపై జెప్పబడిన అర్థమే సాధ్యము. ఇట్లుకూడా **అధో నాదము, ఊర్ధ్వమున బిందువు, మధ్యభాగమున మణిపీఠమండలమును** ధ్యానించ దగునని తేలుచున్నది.

**కంకాళమాలినీతన్త్రమున** గురుధ్యానమున స్పష్టము చేయబడినది–

తే.గీ. అంతరాత్మ సహస్రదళాబ్జవాసి
దానిపై నాదబిందుస్థమైన దొకటి
ఉజ్జ్వలంబగు సింహాసనోన్నతుండు
గురువు నిత్యుడు రజతాద్రి గురుత వెల్గు. ...

మణిపీఠమండలము **పటుతడిత్కడారిమస్పర్ధమానమణిపాటలప్రభమ్** అని విశేషముతో చేర్చబడినది. పటుత్వమనగా స్వకార్యమును సంపాదించికొను యోగ్యత్వము. అందునను, స్వప్రకాశరూపమైన స్వకార్యసంపాదనమును విరోధించు దోషము లేకుండుటచేత సర్వవ్యాపక మైన అతిప్రకాశమానతటిల్లతలయొక్క వర్ణము కపిలవర్ణమును పోలిన కమిలిన రంగు పింగళవర్ణముతో పోటీ పడుచున్న మణులచే పాటలకాంతి గలిగినది, అని అర్థము. అన్ని అంగములందును మణులు పొదుగబడినందున మణిపీఠమను పేరు సార్థకము. ఆ నాదబిందుమణిపీఠమండలముయొక్క శరీరము చిన్మయము, అనగా జ్ఞానమయము. మరియొక విధముగ, **చిన్మయం వపుః** అనగా పంద్రెండు స్వరముల స్వరూపమైన వాగ్భవబీజమగు గురుమన్త్రమను శరీరము చిన్తనీయమని చెప్పుచున్నారు. అది బలములేనిది. గురువు శుక్లవర్ణుడు కనుక వానిని బోధించు బీజముకూడ శుక్లవర్ణమగుటచేత **మణిపాటలప్రభమ్** అను విశేషణము పొసగదు.

---

**శ్లో॥ ఊర్ధ్వమస్య హుతభుక్శిఖాత్రయం
తద్విలాసపరిబృంహణాస్పదమ్।
విశ్వఘస్మరమహోచ్చిదోత్కటం
వ్యామృశామి యుగమాదిహంసయోః॥** **4**

**ప్ర:** అస్య = ఆ మణిపీఠముయొక్క, ఊర్ధ్వమ్ = పై భాగము, హుతభుక్ = అగ్నియొక్క, శిఖాత్రయమ్ = మూడు జ్వాలలను, తత్ = దానియొక్క, విలాసపరిబృంహణ+ఆస్పదమ్ = విలాసము వ్యాపించుటకు ఆటపట్టైన దానిని, విశ్వ = విశ్వముయొక్క, ఘస్మర = నాశమునందు, మహా = గొప్ప, ఉచ్ఛిద+ఉత్కటమ్ = కాంతిచే బలవత్తరమైన దానిని, ఆది హంసయోః = మొదటి 'హం', 'సః' అను రెండిటియొక్క, యుగమ్ = జంటను, వ్యామృశామి = స్మరించుచున్నాను.

**తా:** ఆ మణిపీఠపు పై భాగము మూడు అగ్ని జ్వాలల విలాసవ్యాప్తికి ఆధారమై, మహాకాంతివంతమై, విశ్వవ్యాప్తమై, 'హం', 'సః' అను రెండు ప్రథమయుగళమును స్మరించు చున్నాను.

హంసపీఠము మణిపీఠముపై నున్న త్రికోణమున, నాదబిందువుల మధ్య గురుస్థానమై యున్నది. ఆ హంసను, ఆ త్రికోణమును వివరించుచున్నాడు.

**హుతభుక్శిఖాత్రయం** అనగా అగ్నిరేఖతో మొదలగు మూడు రేఖలు: అగ్ని లేక వామా, జ్యేష్ఠా, రౌద్రీ అను రేఖలు. ఈ రేఖల వ్యాప్తి వలన యేర్పడు త్రికోణము, **తద్విలాసపరి-బృంహణాస్పదమ్,** అనుట. ఇది కామకళారూపమని **విశ్వఘస్మరమహోచ్ఛిదోత్కటం,** అనుటకు తాత్పర్యము. ఇది నిశ్వాసరూపమైన 'హం', ఉచ్ఛ్వాస రూపమైన 'సః' అను హంస స్వరూపము గలది. అట్టి దానిని ధ్యానింతునని తాత్పర్యము.

తే.గీ. వామయుం జ్యేష్ఠరౌద్రి నా వ్యాప్తి జెంది
విశ్వఘస్మరోజ్జ్వలబలావిష్టమైన
ఆది హంసద్వయంబు నే నర్మిలింతు.

**అమలా టీకా**

హంసపీఠోపరి నాదబిందుమధ్యస్థమణిపీఠోర్ధ్వత్రికోణే గురోరధివాసః। అతః తయోః జ్ఞానార్థం హంసత్రికోణయోః స్వరూపం జ్ఞాపయిష్యన్నాహ ఊర్ధ్వమితి। అస్యార్థః। అహం ఆదిహంసయోర్యుగం వ్యామృశామి। ఏవమస్య మణిపీఠస్యోర్ధ్వం హుతభుక్ శాఖాత్రయం వ్యామృశామి। తద్విలాసేన హుతభుక్ శిఖాత్రయస్య సుప్రకాశేన పరిబృంహణాస్పదం ఉద్దిశ్యమానమణిపీఠరూపాస్పదం వ్యామృశామీతి తత్ప్రతిబంధకవిషయచిన్తాదిత్యాగేన స్వస్వస్థానే స్థిరతరం భావయామీతి ప్రత్యేకం క్రియాన్వయః।

హుతభుక్శిఖాత్రయమితి। హుతభుక్శిఖాదిత్రయం హుతభుక్శిఖాత్రయమ్। శాక-పార్థివాదిత్వాత్ మధ్యపదలోపే తత్పదసిద్ధిః। హుతభుక్ వహ్నితచ్ఛిఖా వహ్నిబిందోః అంకురభూతదక్షిణాదీశానపర్యన్తగతా **వామరేఖా।** ఆదినా ఈశానకోణస్య చంద్రబిందో-రంకురభూతేశానాది మరుత్కోణపర్యన్తగతా **జ్యేష్ఠారేఖా।** మరుత్కోణస్థ సూర్యబిందో-

రంకురభూతతదాది వహ్నిబిందుసంగతా రౌద్రీరేఖా। ఏవం త్రిబిందు త్రిరేఖామిలితత్రికోణం కామకలారూపమ్।

తదుక్తం **బృహచ్ఛ్రీక్రమే–**

శ్లో॥ బిందోరంకురభావేన వర్ణావయవరూపిణీ।
బింద్వగ్రే కుటిలీభూతా యామ్యాదీశానమాగతా॥

శ్లో॥ మనోరమా శక్తిరూపా సా శిఖా చిత్కలాపరా।
శక్తీశానగతా రేఖా ప్రత్యగాగ్నేయమాత్రగా॥

శ్లో॥ జ్యేష్ఠా సా పరమేశాని త్రిపురా పరమేశ్వరి।
వ్యక్తీభూయ పునర్వామే ప్రథమాంకురమాగతా।
ఇచ్ఛయా నాదసంలగ్నా రౌద్రీ శృంగాటమాగతా॥ ఇతి॥

సా శిఖేతి ఆగ్నేయమాత్రగా వహ్నిసంబంధినీ మాత్రా సా శిఖా వహ్నిశిఖేత్యర్థః॥

**మాహేశ్వరీసంహితాయామ్–**

శ్లో॥ సూర్యశ్చంద్రస్తథా వహ్నిరితి బిందుత్రయం భవేత్।
బ్రహ్మావిష్ణుస్తథా శంభురితి రేఖాత్రయం మతమ్॥ ఇతి॥

ఏతత్త్రికోణమధ్యే గురుస్థితిం స్పష్టమాహ ప్రేమయోగతరంగిణీధృతవచనమ్।

సహస్రముపక్రమ్య–

శ్లో॥ తన్మధ్యే తు త్రికోణం తు విద్యుతాకారముత్తమమ్।
బిందుద్వయం చ తన్మధ్యే విసర్గరూపమవ్యయమ్॥
తన్మధ్యే శూన్యదేశే చ శివః పరమసంజ్ఞకః॥ ఇతి॥

అత ఏవ శంకరాచార్యేణాపి ఆనందలహర్యాం ఇదం సువ్యక్తమభిహితమ్। శ్రీనాథస్య విసర్గారూఢత్వాత్ ఇతి లలితారహస్యకారేణోక్తం చ। విసర్గస్తు త్రికోణోర్ధ్వవర్తి చంద్రసూర్యరూప బిందుద్వయమితి।

ఆదిహంసయోర్యుగమిత్యత్రాది నాన్తరాత్మసంజ్ఞకపరమహంస ఏవ గృహ్యతే న తు దీపకలికాకారజీవాత్మహంసః। **అయం హంసః ప్రకృతిపురుషరూపః।**

తదుక్త**మాగమకల్పద్రుమే పంచశాఖాయామ్–**

శ్లో॥ హంకారో బిందురిత్యుక్తో విసర్గః స ఇతి స్మృతః।
బిందుః పురుష ఇత్యుక్తో విసర్గః ప్రకృతిః స్మృతః।
పుంప్రకృత్యాత్మకో హంసస్తదాత్మకమిదం జగత్ ॥ ఇతి॥

కేచిత్తు అస్య మణిపీఠస్యోర్ధ్వం ఆదిహంసయోర్యుగం వ్యామృశామీతి వ్యాఖ్యాయన్తి। తన్మన్దం పూర్వోక్తకంకాలమాలినీవచనబోధితహంసోర్ధ్వం నాదబిందుమధ్యస్థమణిపీఠే నాదబిందోరధః స్థహంసస్థితేః సర్వత్రాసంభవాత్। ఏతేన హుతభుక్ శిఖా సమితి కేషాంచిత్ కల్పితపాఠో నిరస్తః। తథాత్వే ఊర్ధ్వమస్యేత్యస్య వైయర్థ్యాపత్తేః। యద్వా అస్య మణిపీఠమండలస్యోర్ధ్వం ఆదిహంసయోర్యుగం వ్యామృశామి। కంకాలమాలినీవచనే నాదబిందుమధ్యస్థితమణిపీఠాధః –స్థలే హంసస్థితిః ప్రాప్తా। అత్ర మణిపీఠోర్ధ్వస్థితికథనే మహాన్ విరోధః। అతః తయోర–వివాదాయ హంస విశేషయతి హుతభుక్శిఖాత్రయమితి। తతశ్చాధఃస్థలే హంస ఇత్యాను–పూర్వికస్య స్థితిః ఊర్ధ్వం పూర్వోక్తత్రికోణాకారకామకలారూపేణ పరిణతస్య తస్య స్థితిరిత్య–విరోధః కామకలాయా హంసరచితమూర్తికత్వాత్।

పునర్విశేషయతి విశ్వఘస్మరమహోచ్ఛిదోత్కటమితి। **జమక్షేల్మఘసౌ చాథ ఘసిజ్ క్షరణే వ్యసక్।** తథా చ–

**"దేఙ్ యాచే చిదిహ్లాదే దీప్తౌ చ్యుదకనుదిచ్ఛిది వా॥"**

ఇతి ధాతుపాఠాత్ ఘసధాతోర్భక్షణార్థత్వమ్। చిదో దీప్త్యర్థత్వమ్। తతశ్చ విశ్వానాం ఘస్మరా భక్షికా అర్థాత్ సంహారికాయా మహోచ్ఛిత్ మహాప్రకాశస్తయా ఉత్కటం దూరతరం సర్వాధికబలవదిత్యర్థః॥

## అనువాదము

హంసపీఠముపై, నాదబిందుమధ్యమున గల మణిపీఠమునకు పై దిక్కున గల త్రికోణమున, గురువుయొక్క ఉనికి. అందువలన ఆ రెండు హంస త్రికోణముల స్వరూపమును ఊర్ధ్వం అనుటతో గుర్తుచేయుచున్నాడు. దాని అర్థము, నేను ఆది హంసముల జంటను విశేషముగ వివరించుచున్నాను, అని. ఈ విధముగ ఈ మణిపీఠముయొక్క పైభాగమగు హుతభుక్ శిఖాత్రయమును విశేషించి వివరించుచున్నాను, అని. అగ్నియొక్క శిఖాత్రయముయొక్క సుప్రకాశముచేత ఉద్దేశింపబడుచున్న మణిపీఠరూపముయొక్క నెలవైనదానిని, దానికి అనుకూలించని విషయముల విచారమును విడచి తనదైన స్థానమున స్థిరతరముగ భావించుచున్నాను, అని ప్రత్యేకముగ క్రియాన్వయము.

అగ్ని శిఖాత్రయము అని, అనగా అగ్ని మొదలగు శిఖలయొక్క త్రయము. శాకపార్థివాదిత్వాత్ మధ్యపదలోపమునందు ఆ పదముతో అర్థసిద్ధి అని సూత్రము. అగ్నిశిఖా అనగా అగ్నిబిందువు అంకురించిన దక్షిణము నుండి ఈశాన్యము వరకు సాగిన **వామరేఖ.** 'ఆది' అనుటచే ఈశాన్యకోణమునందున్న చంద్రబిందువు అంకురించిన ఈశాన్యము మొదలు వాయవ్యకోణమువరకు సాగిన **జ్యేష్ఠారేఖ.** వాయవ్యకోణమునందున్న సూర్యబిందువు

అంకురించిన ఆ మొదటి అగ్నిబిందువును కూడిన **రౌద్రీరేఖ.** ఇట్లు మూడు బిందువులు, మూడు రేఖలు కలిసిన త్రికోణము కామకళారూపమైనది.

**బృహచ్ఛ్రీక్రమంలో** ఇట్లే చెప్పబడినది–

తే.గీ. బిందువంకురభావంబు చెందుగాన
వర్ణములవయవములుగ వరలు చుండు;
అగ్రమున వంగి బిందువు నట్టె సాగి
దక్షిణేశాన దిక్కుల దాకు రేఖ.

తే.గీ. చిత్కలాపరమైన ఆ శిఖయు మనసు
రంజనముచేయు శక్తి మూర్తమయినట్టి
ప్రత్యగాగ్నేయ మాత్రగ బద్ధరేఖ.

తే.గీ. త్రిపుర ఈశాని పరమేశ్వరి యగు జ్యేష్ఠ
వ్యక్తమై స్వేచ్ఛ నాదసంవర్తియగుచు
వామమార్గాన రౌద్రియై వచ్చి కలసె.

'సా శిఖా' అనగా వహ్ని సంబంధియైన ఆగ్నేయమాత్రగ ఆ శిఖ అగ్నిశిఖయని అర్థము.

**మాహేశ్వరీసంహితలో–**

తే.గీ. సూర్యచంద్రాగ్ని బిందువుల్ చూడ మూడు
బ్రహ్మవిష్ణీశరేఖలై పరగుచుండు.

ఆ త్రికోణమధ్యమున గురువు విరాజమానుడని స్పష్టముగ ప్రేమయోగతరంగిణీ ధృతవచనము.

సహస్రమును గూర్చి–

తే.గీ. దానిమధ్య త్రికోణంబు తనరుచుండు;
విద్యుదాకారమై యందు విద్యమాన
మై విసర్గరూపావ్యయమమరుచుండు;
పరమసంజ్ఞక శివుడు తన్మధ్య శూన్య–
దేశమం దట్లె పరగు నుద్దీప్త గురువు.

ఆ కారణముగనే శంకరాచార్యునిచేత కూడ ఆనందలహరిలో ఇది సువ్యక్తముగ చెప్పబడినది. శ్రీనాథుని యొక్క విసర్గారూఢత్వమువలన, అని లలితారహస్యకర్తచేతను కూడ చెప్పబడినది. విసర్గయేమో త్రికోణోర్ధ్వవర్తి చంద్రసూర్యరూపబిందుద్వయము, అని.

**ఆదిహంసయోర్యుగం** అనుదానిలో ఆదిశబ్దముచే అంతరాత్మసంజ్ఞక పరమహంసయే గ్రాహ్యమగుచున్నది, దీపకలికాకారజీవాత్మ హంస కాదు. ఈ హంసము **ప్రకృతిపురుష రూపము**.

**ఆగమకల్పద్రుమ** మందు పంచశాఖలో ఇట్లు చెప్పబడినది–

తే.గీ. హంకృతియె బిందువు పరముడగు విసర్గ;
బిందువు పురుషుడు విసర్గ పేర్మి ప్రకృతి;
పుంప్రకృతిరూపహంసస్వమూర్తి జగము.

కొందఱు మాత్రము ఆ మణిపీఠమునకు పైన ఆదిహంసల రెండింటిని ధ్యానింతును, అని వ్యాఖ్యానించుచున్నారు. అది పొసగదు. పూర్వము చెప్పబడిన కంకాలమాలినీవచనము బోధించు హంసోర్ధ్వము నాదబిందుమధ్యస్థమణిపీఠముననూ నాదబిందువుల క్రిందుగ హంసయుండుట అన్ని విధముల అసంభవమగుట వలన.

దీనివలన ఎవరో కల్పించిన హుతభుక్శాఖాసమితి యను పాఠము వీగిపోయినది. అట్లేయైన, **ఊర్ధ్వమస్య** అను నిది వ్యర్థమగుట వలన. ఆ మణిపీఠమండలమునకు పైన ఆదిహంసలను రెండిటిని ధ్యానింతును. కంకాలమాలినీ వచనంలో నాదబిందుమధ్యస్థిత మణిపీఠమునకు దిగువ ప్రదేశమున హంసస్థితి యైనది. అచట మణిపీఠోర్ధ్వస్థిత మణిపీఠమునకు దిగువ ప్రదేశమున హంసస్థితియైనది. అచట మణిపీఠోర్ధ్వస్థితిని చెప్పుటలో గొప్ప విరోధము. కావున వాని వివాదము లేకుండుటకు 'హంస' కు హుతభుక్శాఖాత్రయమని విశేషము చెప్పబడినది. అట్లును అధోభాగమున 'హంస' యని పరంపరాగతమైన స్థితి, ఊర్ధ్వమున పూర్వోక్త త్రికోణాకార కామకలారూపముగ పరిణతినందిన దాని స్థితియని, కామకలకు హంసరచితమూర్తిమత్వము వలన, అవిరోధము.

మరలను, విశ్వఘస్మరమహోచ్చిదోత్కటమ్, అని విశేషము చెప్పుచున్నాడు. **జ మక్షే లృ ఘసౌ చాథ ఘసిజక్షరణేవ్యసక్**, అను సూత్రము బట్టియు–

**"దేఙ్ యాచే చిదిహ్లాదే దీప్తౌ చ్యుదకసుదిచ్ఛిది వా"**

అను ధాతుపాఠమువలన ఘసధాతువునకు భక్షణము అర్థమగును. 'చిది' యనగా దీప్తి అర్థము. అట్లును, విశ్వములకు ఘస్మరమనగా భక్షకమని అర్థమువలన సంహారికయొక్క మహోచ్చిత్ అనగా మహాప్రకాశము, దానిచేత ఉత్కటం, దూరతరం, సర్వాధికబలము గలది, అను నర్థము కలుగును.

**శ్లో॥ తత్ర నాథచరణారవిన్దయోః**
**కుఙ్కుమాసవపరీమరన్దయోః।**

**ద్వన్ద్వమిన్దుమకరన్దశీతలం**
**మానసం స్మరతి మఙ్గలాస్పదమ్॥ 5**

**ప్ర:** తత్ర = అచట, మణిపీఠముపై త్రికోణమున, నాథ = గురుని, చరణ+అరవిందయోః = పాదములు అను రెండు ఎఱ్ఱనిపద్మములయొక్క, కుంకుమ = ఎఱ్ఱనగు, ఆసవ = అమృతమను, పరీమరందయోః = అతిమధురమగు పూదేనెగలవానియొక్క, ద్వన్ద్వమ్ = జంటను, ఇందు మకరంద = చంద్రామృతముపోలిన, శీతలమ్ = చల్లనగు దానిని, మంగల+ఆస్పదమ్ = శుభముల పుట్టినిల్లగుదానిని, మానసమ్ = మనస్సు, స్మరతి = స్మరించుచున్నది.

**తా:** మణిపీఠముపై త్రికోణమున సుస్థిరుడైన గురుని పాదపద్మముల ఎఱ్ఱని మకరందముగల జంటను చంద్రామృతమకరందమువలె శీతలమైన దానిని, శుభముల గలిగించు దానిని, నా మనస్సు స్మరించుచున్నది.

తే.గీ. మంగలాస్పదచంద్రికామయములగుచు
కుంకుమాసవమకరందకులములగుచు
నచట నొప్పారు గురుని పాదాంబుజముల
నెఱిగి మనసున ధ్యానింతు నెల్లయపుడు.

**అమలా టీకా**

శ్రీనాథచరణారవిన్దచిన్తనాధికరణపీఠం నిరూప్యేదానీం తద్ధ్యానయోగం సూచయన్ స్తౌతి తత్రేతి ద్వాభ్యామ్। అస్యార్థః తత్ర మణిపీఠస్థత్రికోణమధ్యే నాథచరణారవిన్దయోర్ద్వన్ద్వం మానసం స్మరతి ధ్యాయతే ఇత్యన్వయః। చరణద్వన్ద్వం విశేషయతి కుంకుమాసవపరీమరన్దయోరితి।

'వీప్సేదంభావచిహ్నేషు తేషు భాగే పరిప్రతీ।'

ఇతి వోపదేవీయాత్ పరేర్భాగార్థత్వమ్। తతశ్చ కుంకుమాసవానాం లాక్షారసాభ–పరమామృతానాం యః పరిర్భాగః స ఏవ మరన్దో మకరన్దో యయోస్తాదృశయోరిత్యర్థః। "ఝరీమరన్దయోః" ఇతి పాఠే ఝరీ ఝరణం నిఃసరణమితి యావత్। తతశ్చ "కృదభిహితభావో ద్రవ్యవత్ ప్రకాశతే।" ఇత్యుక్తేః కుంకుమాసవానాం ఝరీ అర్థాత్ ఝరణాశ్రయకుంకుమాసవో మరన్దో యయోరిత్యర్థః।

ద్వన్ద్వం కీదృశమ్? ఇన్దుమకరన్దశీతలం ఇన్దోశ్చన్ద్రస్య యో మకరన్దః అమృతకిరణరూపః తద్వత్ శీతలమ్। యథా చన్ద్రామృతకిరణేన ఉత్తాపనివృత్తిస్తథా పదద్వన్ద్వసేవనేన దుఃఖతాపశాన్తిరితి భావః।

మంగలాస్పదం అభిప్రేతార్థసిద్ధిప్రదం స్థానమ్। తచ్చరణస్థానే మనోఽభినివేశే సర్వాభీష్టసిద్ధిరితి తాత్పర్యమ్।

## అనువాదము

శ్రీ గురుచరణారవిందముల ధ్యానాధికరణపీఠమును నిరూపించిన మీదట నిప్పుడు ఆ ధ్యానయోగమును సూచించుచు ఆ ద్వయమునచ్చట స్తుతించుచున్నాడు. దీని అర్థము: అచట మణిపీఠమునగల త్రికోణమధ్యమున గురుచరణారవిందద్వయమును మనస్సు ధ్యానించుచున్నది, అని అన్వయము. చరణద్వయమును కుంకుమాసవపరీమరందములు గలవి అని విశేషమును చెప్పుచున్నాడు.

'వీప్సేదంభావ చిహ్నేషు తేషు భాగే పరిప్రతీ॥'

అని ఇదంభావచిహ్నముల పౌనరుక్త్యమునందు పరిశబ్దమునకు భాగము అర్థమైనందువలన. ఆ కారణముచేత కూడ లాక్షారసమును పోలిన ఎఱ్ఱని ఆసవముల పరమామృతముయొక్క భాగమేదియో అదియే యని వాని అర్థము.

ద్వంద్వము ఎట్టిది? ఇన్దుమకరన్దశీతలమ్, అనగా చంద్రునియొక్క యే మకరందము అమృతకిరణరూపమైనదో దానివలె శీతలము. చంద్రుని అమృతకిరణముచేత ఏ విధముగ మెండైన తాపము తొలగునో అట్లు పాదద్వయమును సేవించుటచేత దుఃఖతాపము శాంతించునని భావము.

మంగలాస్పదం అనగా అభిలషించిన కోరికను సిద్ధింపజేయు స్థానము. ఆ చరణ స్థానమున మనస్సును నిల్పుటవలన సర్వాభీష్టసిద్ధి కలుగునని తాత్పర్యము.

---

**శ్లో॥ నిషక్తమణిపాదుకానియమితాఘకోలాహలం**
**స్ఫురత్కిసలయారుణం నఖసముల్లసచ్చన్ద్రకమ్।**
**పరామృతసరోవరోదితసరోజసద్రోచిషం**
**భజామి శిరసి స్థితం గురుపదారవిన్దద్వయమ్॥ 6**

**ప్ర:** నిషక్తమణిపాదుకా = వ్యాప్తమైన మణిపాదుకలచే, నియమిత = అదుపుచేయబడిన, అఘ = పాపముల, కోలాహలమ్ = సందడిగల, స్ఫురత్ = ప్రకాశించుచున్న, కిసలయ = చివురుటాకుల, అరుణమ్ = ఎఱ్ఱదనముగల, నఖ = గోళ్ళచే, సముల్లసత్ = అందగించుచున్న, చన్ద్రకమ్ = చంద్రులుగల, పర+అమృతసరోవర = అమృతసరస్సునందు, ఉదిత= ఉదయించిన, పూచిన, సరోజ = పద్మముయొక్క, సద్+రోచిషమ్ = చక్కని వెలుగు కలిగినది, శిరసి స్థితమ్ = శిరస్సున ఉన్నదియైన, అనగా ముందు చెప్పబడినట్టి, గురు = గురువుయొక్క, పద+అరవిందద్వయమ్ = ఎఱ్ఱతామరలవంటి పాదముల జంటను, భజామి = సేవించుచున్నాను.

**తా:** గురుని ఎఱ్ఱతామరలవంటి పాదములను సేవింతును. మణులు పొదుగబడిన పాదపీఠముపై ఆ పాదములొప్పారు చుండును. వాని ధ్యానమున పాపసమూహము సందడి చేయుచు పరుగిడి పోవును. ఆ పాదములు చివురాటాకులవలె ఎఱ్ఱని కాంతిగలవి, వెన్నెల చిమ్ముచున్నట్లు తెల్లని గోళ్ళతో అందగించునవి. అమృతసరస్సులో పుట్టిన పద్మపు కాంతివిలాసము గలిగినవి. వీనిని గురించి ముందటి శ్లోకములలో చెప్పబడియే యున్నది.

**శిరసి స్థితం** అనుదానికి **మమ** అధ్యాహారం చేసికొని, నేను తలదాల్చిన వానిని, అని కూడ అర్థము సాధ్యమే.

తే.గీ. మెఱయు చివురుటాకుల బోలు నెఱుపు గలిగి
వెన్నెలల కాంతితో గోళ్ళు వెలుగు లీన
అమృతసరసున వెలిగెడు నబ్జమట్లు
మణులు వెలుగొందు పీఠాన మనెడి గురుని
పాదములఘసమూహము బారద్రోలు
తత్పదారవిందముల నే తలను దాల్తు.

**అమలా టీకా**

నిషక్తేతి। అస్యార్థః అహం శిరసి స్థితం పూర్వోక్తపీఠోపరిస్థితం గురుపాదారవిందద్వయం భజామి ధ్యాయే ఇత్యన్వయః। పదారవిందద్వయం విశేషయతి।

నిషక్తమణిపాదుకానియమితాఘకోలాహలమితి। నిసక్తమణిపాదుకయా సేవిత మణిపాదుకాద్వారా నియమితః నిరస్తీకృతః అఘకోలాహలః పాపానాం ప్రాదుర్భావో యేన తాదృశమిత్యర్థః। యద్వా నిసక్తో నిబద్ధో మణిర్యత్ర పాదుకాయాం సా మణిపీఠమండలపాదుకా తయా నియమితః అఘకోలాహలః యేనేత్యర్థః। తత్పాదుకోపరి గురుచరణచిన్తనేన పాపనాశాత్। అథవా నిసక్త ఆరుద్ధో మణిగురుచరణరూపచిన్తామణిర్యాసు పంచపాదుకాసు తాభిర్నియమితాఘకోలాహలమిత్యర్థః। తశ్చ పాదుకాధ్యానపూర్వకం తదుపరి గురుచరణ చిన్తనేనైవ పాపనాశనాత్ పాపనాశే పంచపాదుకానాం ధ్యానరూపవ్యాపారసాధ్యత్వేన ద్వారత్వమితి।

స్ఫురత్కిసలయారుణమ్। స్ఫురతాం కిసలాలయానాం పల్లవానాం అరుణతుల్యమరుణం యత్రేతి। ఆమ్రకేన్దుకాదిపల్లవానాం ప్రథమోద్గమే రక్తవర్ణత్వాత్ తత్రైవ దృష్టాన్తః।

నఖసముల్లసచ్చన్ద్రకం నఖా ఏవ సముల్లసచ్చన్ద్రాః నిర్మలప్రకాశమానచన్ద్రస్వరూపా యత్రేత్యర్థః।

పరామృతసరోవరోదితసరోజసద్రోచిషమ్ పరామృతసరోవరే ఉదితం యత్ సరోజం పద్మం తద్వత్ సద్రోచిషం నిర్మలప్రకాశో యస్యేతి।

అయం భావః శ్రీనాథస్య చరణాభ్యాం నిరన్తరం పరమామృతం నిఃసరతి।

అత ఏవోక్తమ్ పూర్ణానన్దేన–

శ్లో॥ సుధాధారాసారం నిరవధివిముంచన్నతితరామ్।
యతేః స్వాత్మజ్ఞానం విశతి భగవాన్నిర్మలమతేః॥ ఇతి॥

ఏవం పరామృతం సరోవరస్వరూపం తదుపరిస్థితం చరణం పద్మవత్ ప్రకాశతే ఇతి। నను ఉక్తపద్మద్వయకర్ణికాపుటే గురుస్థితిర్విధీయతే। తత్కిమధఃస్థితద్వాదశదలకమల–కర్ణికాయాం కిం వా ఊర్ధ్వస్థసహస్రదలకర్ణికాయామిత్యాకాంక్షాయామత్ర వదన్తి।

**బృహచ్ఛ్రీక్రమే–**

శ్లో॥ సర్వోపరి తతో ధ్యాయేత్ పశ్చిమానన పంచకమ్।
స్రవన్తమమృతం దివ్యం దేవ్యంగే కమలాన్తరే॥

దేవ్యంగే గురుశక్త్యంగే ఇత్యర్థః।

యామలే–ఛత్రం మూర్ధ్ని సహస్రపత్రకమలం రక్తం సుధావర్షిణమ్॥ ఇతి॥

**గురుగీతాయాం–**

శ్లో॥ హంసాభ్యాం పరివృత్తపత్రకమలే దివ్యైర్జగత్కారణైః
విశ్వోత్తీర్ణమనేకదేవనిలయం స్వచ్ఛన్దమాత్మేచ్ఛయా।
తత్తద్యోగ్యతయా స్వదేశితతనుం భావైకదీపాంకురమ్
ప్రత్యక్షాక్షరవిగ్రహం గురుపదం ధ్యాయేద్విబాహుం గురుమ్॥ ఇతి॥

**యామాసపర్యాధృతవచనమ్–**

శ్లో॥ శిరఃపద్మే సహస్రారే శుక్లవర్ణే త్వధోముఖే।
తరుణారుణకిఞ్జల్కే సర్వవర్ణవిభూషితే॥

శ్లో॥ కర్ణికాన్తఃపుటే తత్ర ద్వాదశార్ణసరోరుహే।
తేజోమయే కర్ణికాన్తశ్చన్ద్రమణ్డలమధ్యగే॥

శ్లో॥ అకథాది త్రిరేఖీయే హలక్షత్రయమండితే।
హంసపీఠే మన్త్రమయే స్వగురుం శివరూపిణమ్॥ ఇతి॥

ఏవమాది వచనైర్ద్వాదశకమలకర్ణికాయాం గురోరధిష్ఠానం విహితమ్।

**కంకాలమాలినీతన్త్రే–**

శ్లో॥ సహస్రదలపద్మస్థమన్తరాత్మానముత్తమమ్।

తస్యోపరి నాదబిన్దోర్మధ్యే సింహాసనోజ్జ్వలమ్।
తస్మిన్నిజగురుం నిత్యం రజతాచల సన్నిభమ్॥ ఇత్యాది॥

**యామలే-**

శ్లో॥ సహస్రదలపంకజే సకలశీతరశ్మిప్రభం వరాభయకరాంబుజమ్- ఇత్యాది।

**పురశ్చరణరసోల్లాసే** - శ్రీ మహాదేవ ఉవాచ-

శ్లో॥ సహస్రారతతో నిత్యే పంకజే పరమాద్భుతే।
పద్మస్య బీజకోశే తు భావయేత్ స్వగురుం సదా॥

శ్రీ పార్వత్యువాచ-

శ్లో॥ సహస్రారే మహాపద్మే సదా చాధోముఖే ప్రభో।
గురుస్థితిః కథం దేవ సతతం వద నిశ్చయమ్॥

శ్రీ మహాదేవ ఉవాచ-

శ్లో॥ శృణు దేవి! ప్రవక్ష్యామి యదేతత్ పృష్టముత్తమమ్।
సహస్రారం మహాపద్మం సహస్రదలసంయుతమ్॥

శ్లో॥ సదా శివపురం తత్తు నిత్యానన్దమయం సదా।
నానాగన్ధయుతం పద్మం సహజానన్దమన్దిరమ్॥

శ్లో॥ సదా చాధోముఖం పద్మం బీజమూర్ధ్వముఖం సదా
త్రికోణాకారరూపేణ కుణ్డలీసంయుతేన చ॥ ఇత్యాది॥

**బాలావిలాసతన్త్రే** శ్రీ దక్షిణామూర్తిరువాచ-

శ్లో॥ ప్రాతరుత్థాయ ధవలే సహస్రారే గురుం స్మరేత్।
అధోముఖే మహాపద్మే సర్వవర్ణవిభూషితే॥

శ్లో॥ అకథాదిత్రిరేఖాద్యహళక్షత్రయభూషితే।
తదన్తశ్చన్ద్రబింబస్థహంసపీఠే స్మితాననమ్॥

శ్రీ దేవ్యువాచ-

శ్లో॥ అధోముఖే గురుస్తత్ర కథం తిష్ఠతి చ ప్రభో।

శ్రీ దక్షిణామూర్తిరువాచ-

శ్లో॥ అధోముఖస్య పద్మస్య కర్ణికామధ్యసంస్థితమ్।
చన్ద్రబింబం చోర్ధ్వవక్త్రం హంసస్తతఃస్థితః॥ ఇతి॥

ఏతదాదిభిర్వచనైః సహస్రదలకర్ణికాయాం గురోరవస్థితిర్విధీయతే। ఏవం చోభయకల్పే విహితే శ్రీనాథస్య ఆజ్ఞయా తయోరేకతరమ్ అవధార్యాఽనుష్ఠేయమితి సిద్ధాన్తః।

అత ఏవోక్తం **కులార్ణవే** ఏకాదశోల్లాసే–

శ్లో॥ పారంపర్యాగమామ్నాయం మన్త్రాచారాదికం ప్రియే।
సర్వం గురుముఖాల్లబ్ధం సఫలం స్యాన్న చాన్యథా॥

**అనువాదము**

'నిషక్త' అని ఆరంభము. దాని అర్థము, నేను ముందుగా చెప్పబడిన పీఠమున శిరస్సునందున్న గురువుయొక్క పాదపద్మముల జంటను ధ్యానింతును, అని అన్వయము.

నిషక్తమణిపాదుకానియమితాఘకోలాహలము, అని పాదారవిందముల విశేషము చెప్పబడినది. వ్యాప్తమైన మణికాంతులుగల పాదుకలచే త్రోసివేయబడిన పాపముల సమూహము గలవి ఆ గురుచరణములు, అని, లేదా, సేవింపబడిన మణిపాదుకల ద్వారా నియమింపబడిన పాపముల గుంపు గలవి, అని. లేదా, గురుచరణరూపచిన్తామణులనదగు పంచపాదుకలచే త్రోసివేయబడిన పాపసమూహము గలది, అని అర్థము. అదియును పాదుకాధ్యానమును, ఆపై గురుచరణచిన్తమును చేసినందువలననే పాపనాశము సాధ్యమగుట.

ఆ గురుపాదములు ప్రకాశించుచున్న చివురుటాకుల ఎఱుపుగలవి. మామిడి, కేందుకము, మొదలగు వృక్షముల చివుళ్ళు రక్తవర్ణము గలవి కనుక వానితోనే పోలిక.

నఖసముల్లసచ్చంద్రకం, అని విశేషము. ఆ గురువుయొక్క పాదముల వ్రేళ్ళగోళ్ళు వెలుగులీనుచున్న చంద్రుని వంటివని, అంత తెల్లని వని అర్థము.

అట్లే, ఆ గురుపాదములు పద్మముల స్వచ్ఛమైన కాంతిగలవి. ఆ పద్మములు పరామృత సరోవరమునందు పూచినవి. కాగా, పరమమైన, అలౌకికమైన, అమృతత్వమునందు రూఢమైనవి, కనుక వాని ప్రకాశము నిర్మలము. అనగా, గురుపాదముల నుండి పరమామృత తత్త్వము నిరంతరము స్రవించునని భావము.

అందువలననే పూర్ణానందునిచే చెప్పబడినది–

తే.గీ. అధికముగ నిరవధిగను సుధలజిందు
స్వాత్మనిర్మలమతియైన స్వామి సంజ్ఞ.

ఈ విధముగ సరోవరస్వరూపమైన పరామృతముపై నెలకొన్న పాదము పద్మమువలె ప్రకాశించును, అని. పై జెప్పబడిన రెండు పద్మముల కర్ణిక మధ్యభాగమున గురువు స్థితి అను నిర్ణయము చెప్పబడినది కదా! అయిన అది క్రిందుభాగమున గల ద్వాదశదలకమలపు కర్ణిక యనియా? లేక పైన గల సహస్రదళపు కర్ణికయందు అనియా? అను సంశయనివృత్తికై ఇది చెప్పడినది, బృహచ్ఛ్రీక్రమంలో–

తే.గీ. సర్వమునకూర్ధ్వమున మానసంబు నిల్పి
దివ్యమమృతస్రవమునైన త్రిభుజమందు
పశ్చిమాననపద్మంబు భావ్యమగును.

**యామలము**నందు–

తే.గీ. అమృతవర్షిణి ఎఙ్టనౌ అబ్జమొండు
వేయిరేకుల విరబూచి విస్తరించి
ఆతపత్రంబునా శిరమందు నిలచు.

**గురుగీత**యందు–

తే.గీ. హంసదళపద్మమున నిల్పి యాత్మగురుని
పరమ గురుడని కొల్వుమా భావమందు:
ఎన్ని లౌకికరూపాల గొన్నగాని
తా నలోకమాత్రుడగు స్వతంత్రు డగును,
వాని దీప్తియె ముక్తియై వరలు నట్టి
అక్షరద్వయ గురుదేహి యగు నతండు,
మూర్తిమంతుడై పుడమి నీ మ్రోల గలడు.

**శ్యామాసపర్య**వచనమిది–

తే.గీ. అరుణకింజల్కశోభితమమలవర్ణ
మగుచు సర్వవర్ణవిభూషియై అధోము
ఖాబ్జమగు దాని కర్ణికారంబునందు,
శిరసున, సహస్రదళసరసీరుహాన
ద్వాదశార్ణపద్మంపు హృద్ధామమందు
కర్ణికాంతఃపుటమునందు కలిగినట్టి
ద్వాదశార్ణసరోరుహధామమందు
కర్ణికాంతరశశిచంద్రికాంతరమున
అకథలున్ హలక్షలనెడు నాఱు నమరు
మంత్రమయహంసపీఠి నస్మద్గురువును
శివుని రూపైనవానిని (చేరి కొలుతు).

ఈ విధమగు వచనములచే గురుని ఉనికి ద్వాదశదళకమలమందని నిర్ణయము.

**కంకాళమాలినీతన్త్రమున**–

తే.గీ. అంతరాత్మ సహస్రదళాబ్జవాసి
దానిపై నాదబిందుస్థమైనదొకటి
ఉజ్జ్వలంబగు సింహాసనోన్నతుండు
గురువు నిత్యుడు రజతాద్రి గురుత వెల్గు. ...

**యామలంలో–**

తే.గీ. సకలశీతరశ్మిప్రభాసత్తగలిగి
వేయిరేకుల తమ్మిలో వెలుగువాని
వరదముద్రాభయకరుని గురు వరిష్ఠు. ...

**పురశ్చరణరసోల్లాసము**న శ్రీమహాదేవుడిట్లనెను–

తే.గీ. వేయిరేకుల తమ్మిగా విరియుదాని
బీజకోశాన నిత్యుడై వెలయువాని
స్వగురు నెప్పుడున్ భావింపదగునుసుమ్ము.

శ్రీ పార్వతి ఇట్లనెను–

తే.గీ. దేవదేవ! నిశ్చయముగ తెల్పగదవె
వేయిరేకుల తమ్మి నెవ్విధి నెలకొను
క్రిందుముఖమైన దాన సశ్రీక గురువు.

శ్రీ మహాదేవుడిట్లనెను–

తే.గీ. ఉత్తమంబైన నీ ప్రశ్న కుత్తరంబు
వినుమిదే చెప్పుదున్ దేవి! విశదముగను:
వేయిరేకుల పద్మమై విరియుచుండు
వివిధగంధిల కుండలీ వృత్తమగుచు
నూర్ధ్వముఖబీజకోణత్రయోర్జితంబు
శివపురంబు నిత్యానందభవనమగుచు. ...

**బాలావిలాసతన్త్రము**న శ్రీ దక్షిణామూర్తి ఇట్లనెను–

తే.గీ. సర్వవర్ణవిభూషితసరసిజమున
క్రింది ముఖమౌ సహస్రారమందు గురుని
ప్రొద్దు ప్రొద్దున పూజింప కద్దు ఫలము.

తే.గీ. అకథరేఖాత్రయహళక్షలమరుచోట

చంద్రబింబస్థపీఠహంసాసనాన
స్మితవదను గురుని ప్రణతోఽస్మియనుటొప్పు.

శ్రీదేవి ఇట్లనెను–

తే.గీ. క్రిందు ముఖమైన అచ్చోట నెందు నిలచు
నో ప్రభూ! గురువర్యుడనూహ్యమగును.

శ్రీ దక్షిణామూర్తి ఇట్లనెను–

తే.గీ. పద్మమైన నధోముఖి పద్మకర్ణి–
కారమూర్ధ్వముఖంబగు గాన నందు
హంసపీఠాన గురువుండు ననుట చెల్లు. ...

ఈ మొదలగు వచనములచే సహస్రదలకర్ణికయందు గురువుండుట గ్రాహ్యము. ఇట్లు రెండు విధములుగ చెప్పబడినందున వానిలో గురుని ఆజ్ఞచే ఏదేనొకటి సాధనార్థము గ్రహింపదగును, అన్నది సిద్ధాంతము.

ఈ కారణముగనే **కులార్ణవము**న ఏకాదశోల్లాసమున ఇట్లని చెప్పబడినది–

తే.గీ. మంత్రమును తదాచారమున్ ఫలమునిచ్చు
గురుముఖపరంపరాగతాచరితములుగ.

---

**శ్లో॥ పాదుకాపఞ్చకస్తోత్రం పఞ్చవక్త్రాద్వినిర్గతమ్।**
**షడామ్నాయఫలప్రాప్తం ప్రపఞ్చే చాతిదుర్లభమ్॥ 7**

**ప్ర:** షట్+ఆమ్నాయ = ఆఱు క్రమముల, ఫల = ఫలమును, ప్రాప్తమ్ = పొందించునదగు, పంచవక్త్రాత్ = ఐదుముఖములనుండి, వినిర్గతమ్ = వెలువడినదైన, పాదుకాపంచక స్తోత్రం = పాదుకాపంచకస్తోత్రము, ప్రపంచే చ = ప్రపంచమునందేమో, అతిదుర్లభమ్ = చాల శ్రమతో పొందదగినది.

**తా:** ఈ పంచపాదుకాస్తోత్రము లోకంలో చాలా కష్టసాధ్యమైనది. ఇది పరమేశ్వరుని ఐదు ముఖముల నుండి వెలువడినది. ఆఱు రీతుల ఫలమిచ్చునది.

తే.గీ. ముఖములైదిటి పలుకులై ముదము గూర్చు
పంచపాదుకాస్తోత్రము ఫలము నిచ్చు
లోకదుర్లభషడ్విధాలోచనముల.

## అమలా టీకా

స్తోత్రఫలశ్రుతిమాహ। పాదుకాపంచకస్తోత్రమితి। పదరక్షణాధారః పాదుకా తాసాం పంచకమ్। పద్మమ్॥ 1 ॥ తత్కర్ణికాస్థలే అకథాదిత్రికోణమ్॥ 2॥ తదన్తర్నాదబిందు మణిపీఠమండలమ్॥ 3॥ తదధఃస్థ హంసః॥ 4 ॥ పీఠోపరిత్రికోణమ్॥ 5॥ సముదాయేన పంచసంఖ్యకమ్।

అథవా పద్మమ్॥ 1॥ త్రికోణమ్॥ 2॥ నాదబిందు॥ 3॥ మణిపీఠమండలమ్॥ 4॥ తదూర్ధ్వస్థ త్రికోణాకారకామకళారూపేణ పరిణతో హంసః॥ 5॥ ఇతి పంచసంఖ్యకమ్। తస్య స్తోత్రమ్। ఫలశ్రుతిసహితసప్తశ్లోకాత్మకమిత్యర్థః।

పంచవక్త్రాద్వినిర్గతమితి। శివస్య పంచవక్త్రాణి యథా **లింగార్చనే తన్త్రే**–

శ్లో॥ సద్యోజాతం పశ్చిమే తు వామదేవం తథోత్తరే।
అఘోరం దక్షిణే జ్ఞేయం పూర్వే తత్పురుషం స్మృతమ్।
ఈశానం మధ్యతో ధ్యేయం చిన్తయేద్భక్తితత్పరః॥ ఇతి॥

తేభ్యో వినిర్గతమ్ తైరుక్తమ్।

షడామ్నాయఫలప్రాప్తమితి। షణ్ముఖాని యథా పూర్వోక్తాని పంచ। షష్ఠవక్త్రం తు పూర్వ–వక్త్రస్యాధస్తాత్ గుప్తం తామసమ్। ఏతత్తు శివతన్త్రే సద్యోజాతాది షట్వక్త్రన్యాసే "**ఓం హం హ్రీం ఔం హ్రీం తామసాయ స్వాహా**" ఇత్యనేన తత్రోక్తధ్యానే "నీలకంఠమధోవక్త్రం కాలకూట–స్వరూపిణమ్" ఇత్యనేన చ ప్రకటితమ్॥ మిలిత్వా షట్వక్త్రాణి భవన్తి। ఏభిః షట్వక్త్రై–రామ్నాయతే కథ్యతేఽసౌ ఇతి షడామ్నాయః శివోక్తస్తోత్రసముదాయః। తస్య ఫలం తత్త–న్మన్త్రసముదాయవిహితకర్మఫలం ప్రాప్యతే యేనేత్యర్థః।

ప్రపంచే లింగాద్యాబ్రహ్మపర్యన్తమాయాప్రకటితసంసారే। అతిదుర్లభమితి అతిదుఃఖేన లభ్యతే యత్తదతిదుర్లభం తల్లాభకరణపుణ్యపుంజజనకజన్మాన్తరీయతపసః క్లేశస్వరూపత్వాత్ దుఃఖలభ్యత్వమితి భావః॥

॥శ్రీ కాలీచరణకృతా పాదుకాపంచకస్తోత్రస్య టిప్పణీ సమాప్తా॥

## అనువాదము

స్తోత్రఫలశ్రుతిని చెప్పెను. పాదుకాపంచకస్తోత్రము, అని. పాదములకు రక్షణాధారము పాదుక – అట్టి పాదుకల పంచకము – (1) పద్మము, (2) ఆ పద్మపు కర్ణికయందు అకథ మొదలగు త్రికోణము, (3) దాని మధ్య నాదబిందుమణిపీఠమండలము, (4) దాని క్రిందనున్న హంసః, (5) పీఠముపైన త్రికోణము, మొత్తము అయిదు.

అట్లుకాకున్న (1) పద్మము, (2) త్రికోణము, (3) నాదబిందువులు, (4) మణిపీఠ మండలము, (5) దానిపైనున్న త్రికోణాకారమునగల కామకళారూపమున పరిణమించిన హంసః, అని అయిదు. ఈ పంచకముయొక్క స్తోత్రము. ఫలశ్రుతితో కూడి మొత్తము ఏడు శ్లోకముల పరిమాణము గలది అని అర్థము.

పంచవక్త్రములనుండి వెలువడినది, అని. లింగార్చనతన్త్రమున చెప్పబడిన శివుని పంచవక్త్రములు–

తే.గీ. పశ్చిమంబు సద్యోజాతపరముఖంబు,
నుత్తరముఖంబు వామదేవోక్తమగును,
దక్షిణ మఘోరమున్ పూర్వతత్పురుషము,
మధ్య నీశానమున్ భక్తమానితములు.

వీనినుండి వెలువడినవి, అనగా, వీనిచే పలుకబడినవి.

షడామ్నాయఫలప్రాప్తము, అని. ఆరు ముఖములు: పూర్వము చెప్పినవి అయిదు. ఆఱవముఖమేమో పూర్వముఖము, అనగా తత్పురుషమునకు క్రిందుగా దాగియున్న తామసము అనునది. ఇదేమో శివతన్త్రమున సద్యోజాతాది షట్వక్త్రన్యాసమున “**ఓం హం హ్రీం ఔం హ్రీం తామసాయ స్వాహా**” అని అచట చెప్పబడిన ధ్యానమున “నీలకంఠమధోవక్త్రం కాలకూటస్వరూపిణమ్” అను నీ వాక్యముచేతను కూడ ప్రకటింపబడినది. వెరశి ఆఱు ముఖములగుచున్నవి. ఈ ఆఱు ముఖములచే ఇవి చెప్పబడినవి, అని శివోక్తస్తోత్ర–సముదాయము. దాని ఫలము ఆ యా మంత్రసముదాయప్రోక్తమైన కర్మఫలము దీనిచే లభించును, అని అర్థము.

ప్రపంచమున, అనగా, దేహాది బ్రహ్మపర్యంతము మాయా ప్రకాశితమైన సంసారమున, అని. **అతిదుర్లభమ్,** అని, అనగా అతిదుఃఖముతో లభించునది యేదియో అది లభించునట్లు చేయు పుణ్యములను కలిగించు జన్మాంతరముల తపస్సు వలననైన క్లేశస్వరూపమువలన దుఃఖలభ్యమని భావము.

**ఇది**

**శ్రీకాళీచరణవిరచిత పాదుకాపంచకస్తోత్రవ్యాఖ్య సమాప్తము.**

**శ్రీః**



## సంక్షేపతః తదేతత్తత్త్వబీజపదదర్శకకోష్ఠకం ప్రదర్శ్యతే।

| బీజాని | తత్త్వాని | బీజాని | తత్త్వాని |
|---|---|---|---|
| 1. కః | పృథ్వీ | 14. ధః | పాదా |
| 2. ఖః | ఆపః | 15. ణః | వాక్ |
| 3. గః | తేజః | 16. తః | ఘ్రాణమ్ |
| 4. ఘః | వాయుః | 17. థః | జిహ్వా |
| 5. ఙః | ఆకాశః | 18. దః | చక్షుః |
| 6. చః | గంధః | 19. ధః | త్వక్ |
| 7. ఛః | రసః | 20. నః | శ్రోత్రమ్ |
| 8. జః | రూపమ్ | 21. పః | ప్రకృతిః |
| 9. ఝః | స్పర్శః | 22. ఫః | అహంక్రియా |
| 10. ఞః | శబ్దః | 23. బః | బుద్ధిః |
| 11. టః | పాయుః | 24. భః | మనః |
| 12. ఠః | ఉపస్థః | 25. మః | పురుషః |
| 13. డః | పాణీ | | |

26. యః కలా(బంధః) – వాయోః సర్వకర్తృత్వశక్తిసంకోచాత్కలామాత్రకర్తృత్వరూపః। మాయాతత్త్వాధిష్ఠానఇచ్ఛా।
27. రః అవిద్యా(బంధః)– అగ్నేః సర్వజ్ఞతాశక్తిరూపవిద్యాసంకోచాదల్పజ్ఞతారూపః।
28. లః రాగః(బంధః) – పృథ్వ్యాః పూర్ణత్వశక్తేః సంకోచాదాశంసారూపః।
29. వః కాలః(బంధః) – సలిలస్య నిత్యత్వశక్తేః సంకోచాదనిత్యతారూపః।
30. ళః నియతిః(బంధః)– ఆకాశస్యావ్యాపకత్వశక్తేః సంకోచాద్దేశనైయత్యరూపః।
31. శః శుద్ధవిద్యా
32. షః ఈశ్వరః
33. సః సదాశివః
34. హః శక్తిః
35. క్షః బిందురూపః శివః
36. స్వరాః సకలవిశ్వబీజభూతాః కలాః। మాయాతత్త్వమ్ చ। తత్ర ఈకారే మాయాబీజా యకారః మాయాస్థానం ఇతి వివేకః।